ముతో నాంగ్లసేనలపై బడెననియు తమ ఫిరంగులన్నియు కట్టుబడె ననియు వినుటతోడనే సర్ హూగ్రోజు గుండెలు పీచుపీచు మనుచుం డెను. వెంటనే యతడు ఒంటెల దళమును తీసికొని తానేదానికి సైన్యాధిపతియై యతివేగమున వచ్చి కాల్పీ సేనపై బడెను. విప్లవసేనలు చాల కాల మాంగ్లసేనతో ఘోరయుద్ధము జరిపెను. ఇంతలో వారిపై నెనుబదియారు యిరువదియైదు నెంబరు పటాలములలోని శూరులు గూడ వచ్చిపడుటతోడనే విప్లవకారులు చిందర వందర కాజొచ్చిరి. సర్ హూగ్రోజుయొక్క ఒంటెలదళము పైనుండి గుండ్లవర్ష మతి తీవ్రముగా విప్లవకారుల నొప్పించెను. కాల్పీసేనలు పారిపోవ జొచ్చెను. లక్ష్మీబాయి తన సేనలకు దీసి కొని ఆంగ్లేయుల ఫిరంగుల నణచివేసి వారిని వెనుకకు గొట్టుట కనేక ప్రయత్నములను జేసెను. కాని పీష్వాసేనల సాహసముడుగుటచే నా రామెతో రాజాలక యామెకెట్టి సహాయమును జేయరైరి! ఆమె యొక్క తెలియు యెంతసేపు ముందుకు పోగలదు! దాని వలన లాభ మేమియును లేదని యామె కూడ నిరాశచేసికొని పీష్వాడేరాకు మరలెను. కాల్పీసేనలు పారిపోవుటను జూచి రోజు దొర తనసైన్య ములతో నాలుగువైపులను వారిని ముట్టడింప నారంభించెను; విజ యోత్సాహముచే నాంగ్లసేనలు శతృసంహారమునందు తమ కసిదీర్చు కొనుచుండిరి. వారికి దొరికినవారినందరను చావగొట్టిరి. వెయ్యమంది విప్లవకారులు భయభ్రాంతులై యమునానదిలో బడిరి. పీష్వాసేన యెంత యున్ననేమి? వారి కేశిక్షయును లేదు. కనుకనే సుశిక్షితులైన సర్ హూగ్రోజు తన సేనలతో వారిని సునాయాసముగ నోడించెను.

విప్లవకారులను యుద్ధస్థలమునుండి తరిమివేసి కాల్పీలో బ్రిటిషుజెండా నెగురవేయుటకు సర్ హూగ్రోజు నిశ్చయించి బ్రిగేడి యరుస్టువర్టును యమునానదిరొడ్డునుండి రమ్మని నియమించి తాను స్వయముగా కాల్పీచేరెను. ఆంగ్లేయులు పట్టణములో స్వేచ్ఛగా బ్రవేశించిరి. విప్లవకారులు కొంతసేపు పోరాడి పారిపోయిరి. బాందా నవాబు రావుసాహెబు పీష్వా, లక్ష్మీబాయి మొదలగు వారతి

మత్కారముగా నంతకుమునుపే కోటను విడిచిపోయిరి. ఆంగ్లేయులు కోటను యుద్ధమక్కరలేకుండగనే స్వాధీనము చేసికొనిరి. ఫుసాహేబు తాంత్యాతోపే మొదలగువారు సంవత్సరము పొడుగను కష్టపడి సంపాదించిన యుద్ధసామగ్రియంతయు నాంగ్లేయులమయ్యెను. ఆంగ్లేయులకు ఒక్కసారి 60000 పౌనులమందు ల్పీకోటలో లభించెను దీనినిబట్టి ఫిరంగులు, తుపాకులు; స్త్రలు మొదలగునవెన్ని వారికి దొరకెనో మనమూహించు కొనచ్చును. యథార్థమైన శిక్షణ లేకపోవుటయే విప్లవసేనలోడిపోవుస కారణమని దీనివలన పూర్తిగా స్పష్టమగు చున్నది.

సర్ హ్యూరోజు అనేక కష్టములను సహించి కాల్పీయుద్ధములో యించినందులకు గవర్నరు జనరల్ కానింగు వాని నిట్లభినందించెను, నేటివరకును మీరు గాంచుచున్న జయపరంపరలలో నీవిజయ మతిముఖ్యమైనది. ఈవిజయమునకు నేను మిమ్ములను మీతో పనిచే శూరులగు సైనికులను నెక్కువగా నభినందించుచున్నాను.” ఈ కారముగా సర్ హ్యూరోజు మధ్యభారతదేశములో విప్లవకారుల దర నణచివేసి బ్రిటిషుజండా స్థాపించెను. తరువాత కమాండర చీఫ్ కాంబెల్ తన స్వాధీనములోనున్న సేనలను రెండు భాగలు చేసి ఝాన్సీగ్వాలియరులను బందోబస్తుచేయుటకు బంపించెను. రోజు యుద్ధము మొదలయినది లగాయితు కఠిన బరిశ్రమయుచుండుటచే నలసిపోయి సెలవుదీసికొని బొంబాయికి పయనయ్యెను.

---

# ఝాన్సీ లక్ష్మీబాయి

## ౭

## గ్వాలియరుయుద్ధము—లక్ష్మీబాయివీరశయ్య.

కాల్పిలో బ్రిటిషుజండా యెగుర వేయబడెను. రావుసాహెబు యుద్ధములో చనిపోగా మిగిలిన సేనలతో పారిపోయి గ్వాలియరుకు నలుబదియారు మైళ్ళ దూరములోనున్న గోపాలపురమను గ్రామమును జేరెను. లక్ష్మీబాయికూడ నతనితోడనే యుండెను. పీష్వా సేనానియగు తాత్యాటోపె కోంచ్ గ్రామములో నోడిపోయినతరువాత నతని ముదుసలి తండ్రిని కలుసుకొనవలెనని చర్ఖీయను గ్రామముకు బోయెనట. కాల్పిపరాభవమును వినుటతోడనే యాత డత్యాతురతతో బరువెత్తుకొని వచ్చి గోపాలపురములో పీష్వాను కలుసుకొనెను. బాందా నవాబుకూడ పరుగెత్తుకొనుచు గోపాలపురము జేరెను:

రావుసాహెబు, బాందానవాబు, తాత్యాటోపెలు ముగ్గురును కలసి ముందుచేయవలసిన కర్తవ్యమును గురించి తెన్ను గానక నేమి చేయుటకును తోచక దీర్ఘాలోచనలను సలుపుచుండిరి. 1856 జూను నెల మొదలు ఉత్తరహిందూ స్థానమందెచ్చటజూచినను సాగరు, కాల్పి, ఝూన్సీ, ఆగ్రా, లక్నో, కాన్పూరు మొదలగు ననేకస్థలములందు విప్లవజండా యెగురుచుండెను. కాని యిపుడు 1858 లో తిరుగ నాంగ్లసామ్రాజ్యము ప్రతిష్ఠింపబడెను. ఎచ్చట జూచినను యూనియన్ జాక్ పతాకమే యెగురుచుండెను. విప్లవకారుల సైన్యములు చాలవరకు యుద్ధములో చనిపోయెను. మిగిలినవన్నియు చెల్లాచెదరై పోయెను. వారికోటలు, వారిపట్టణములు, వారి ధనము, వా ఫిరంగులు, మందుగుండుసామాగ్రి యంతయు నాంగ్లేయులవశమై పోయెను. ఇందువలనశత్రుసేనలంతకంతకు బలపడుచుండెను. యుద్ధము చేయుటకా ఆయుధములు లేవు; ధనము లేదు; సైన్యము లేదు. ఊరకొనుటకా వీలులేదు. అంగ్లేయులు లోకవంక తరుముకొనివచ్చు

డిరి. ఇట్టి సంకటసమయములో నేమియును దోచక రేయిం
ృ పైన పేర్కొనబడిన విప్లవనాయకులు ముగ్గురును గ్రాహగ్రస్త
ద్రిముభంగి "నీవేతప్ప నితఃపరంబెరుంగ దీనునిన్ గావవే"
ఛందమున చింతానిమగ్నులై యుండిరి.

కాని వారిపరిక్కనున్న సింగపుగొదమ మేల్కొనియే
ండెను; రాణీలక్ష్మీబాయి హృదయమునుండి పొంగి పొంగి తేజ
ునుండిన క్షాత్రతేజ మామెను దప్ప మరెవ్వరికి దృగ్గోచరము
లదు!

ఆమె జయాపజయములకు వెరువక సమయము దొరకినపుడెల్ల
గ్లేయులతో యుద్ధము చేయుటకే దృఢనిశ్చయురాలై యుండెను
రోమణివలె మరియొక సారి రణరంగమున కురికి తన యద్వితీయ
్యలక్ష్మిని బ్రదర్శించి విజయలక్ష్మిని బడయవలెనని లక్ష్మి సదా
ుచుచు కాలము కొరకు వేచియుండెను.

రావుసాహెబు కిష్వాచింతాక్రాంతుడై యున్నాడను సం
యామెకు దెలియుటతోడనే ఆమె రావుసాహెబు డేరాకు స్వయ
గా బోయి యతని నిట్లుపశమింపజేసెను.

"నేటివరకును శౌర్యమును జూపిన మనవీరు లందరు నేదో
క యభేద్యమైన గోట నాశ్రయముగా దీసికొనియే యట్లు చేసిరి
ల్మానుల నోడించి హిందూసామ్రాజ్యమును స్థాపించిన ఛత్ర
శ్రీశివాజీ మహారాజు గూడ సింహగఢ, రాయగఢ, తోరణ
దలగు కోటలనుబట్టుకొనెను. పట్టినెందటనే యత డాత్మరక్ష
ను, యుద్ధము చేయుటకును యోగ్యమగు ప్రచండదుర్గములను
వశము చేసికొనెను. తరువాత నతని పరాక్రమమును శౌర్యమును
పి సామ్రాజ్యమును స్థాపించెను. కనుక నీప్రాచీనయనుభవ
ు బట్టిచూడ కోటలేకుండ మనము యుద్ధము చేయుట వృథయని
మగు చున్నది. ఝాన్సీ కాల్పిలవంటి యసామాన్య దుర్గ
ు మనచేతులలో నుంటచేతనే మన మింత కాల మాంగ్లేయు
తో ఘోరయుద్ధమును చేయగలిగితిమి. మన దురదృష్టము చే

నిప్పు డవి మనచేతులలోనుండి జారిపోయినవి. కనుక మన మిప్పు డొక ప్రచండదుర్గమును బట్టుకొనుట ముఖ్యావసరము. మన మిప్పు డెచ్చటికి పారిపోయినను అంగ్లసేనలు మనలను దరిమి నాశము జేయువరకు నూరకుండవు. ఏమి జరిగినను జరుగుగాక! మన వెట్టిఫలమును గురించియు ధ్యానింపక నిప్పు డేదో యొకకోటను పట్టుకొనవలెను. దానిని మద్దతుగా తీసుకొని యాంగ్లేయులతో బోరి విజయమును సంపాదింపవలెను. ఇదియే మన మిపుడుచేయవలసిన కర్తవ్యము. లక్ష్మీబాయి చెప్పిన యీ సలహా వారికందరకును క్రొత్తశక్తిని గలిగించెను. వారు దాని నామోదించి యేకోటను పట్టుకొనుట యోగ్యమను విషయమును మరల నామెనే యడిగిరి. ఈసమయమున ఝాన్సీ లేక కాల్పికోటలను బట్టుకొన యత్నించుట శత్రుసమ్ముఖమున బడుట తప్ప మరొండు కానేరదు. గ్వాలియరుకోటను ముట్టడించి సింధియా సర్కారు యొక్కయు నతని సైన్యముయొక్కయు సహాయమును దీసికొనవలెను; అచట రాత్రికోట నాశ్రయముగా జేసికొనుచో మనము కొంతకాలము యుద్ధము సాగింప వచ్చును; విజయమును పొందగలమను యభిలాషగూడ నప్పుడు మనకు బూర్తిగా గనీలు గలదు.'' అని యామె ప్రత్యుత్తర మిచ్చెను. ఆమె యొసగిన యద్భుతసలహానుగురించి కలనల్ మేలిసన్ యిట్లు వ్రాయుచున్నాడు:

"విప్లవనాయకులకు పరుస్థితులన్నియు జాల విషయమనుగను, అపాయకరముగను కాన్పించెను. కాని ప్రతి అపాయమునకు నేదో యొక యుపాయము తట్టుచుండును; అట్లేయత్యంత సాహసముగా గోచరించినట్టి యొక యుపాయము నా విప్లవనాయకులలో నొకరు కనిపెట్టిరి. దాని నెవరు కని పెట్టిరో దృఢముగా తెలియదు; కాని యావిప్లవనాయకులగు పీష్వా, బాందావవాబు, తాత్యాతోపె, లక్ష్మీబాయిల నలువురి పూర్వచరిత్రలను బట్టి పరిశోధించినచో మనము రావుసాహెబు పీష్వా, బాందావవాబుల శక్తిసామర్థ్యములను గురించి యాలోచింప నవసరమే లేదు; అట్టి సాహసము, అట్టి దూరదృష్టి, అట్టి నిపుణతగల పథకమును గనిపెట్టుటకు గావలసిన ధీశక్తి

శీలముగాని వారిలో లేదు. ఇక మిగిలిన తాత్యాతోపె లక్ష్మీ
ంలలో తాత్యాతోపెను గూడ మనము విడచిపెట్ట వచ్చును.
కట్టి ధైర్యసాహసములు లేకపోలేదు; కాని యతని జీవితములో
కలిగిన జయ పరంపరలలో నత్యంత ప్రధానమైన యీ
నమై యతడు తనను గురించి వ్రాసికొనిన స్మరణములలో నెచ్చ
తానే దానినిర్వహించినట్లు చెప్పుకొనియుండలేదు. ఇక ఝాన్సీ
బాయికే ఈమహోత్కృష్ట కార్యములకు గావలసిన ధీశక్తి,
సాహసములు, ఆశాపాశములను ఛేదించుట మొదలగు నద్భుత
ం చెల్లును. ద్వేషము, పగదీర్చుకొనుట శత్రురక్తమును జూడ
నలెననుకోరిక జయించుట కేమాత్రమవకాశమున్నను సమ్మెట
ు చేయవలెనను నిచ్చ మొదలగువానిచే నామె యీ కార్యము
బోత్సహింపబడెను; జయించుట కామెకుగల యవకాశముల
ను గుర్తింప గలిగెను. తాననుకొనినట్లు మొదటిదెబ్బ గూబ
ర్యమనునట్లు తగులునెడల యదృష్టము మారిపోవచ్చునని కూడ
ను తలచెను. తనస్నేహితులలో నొకడగు రావుసాహేబు
పై నామె కపారమైన పలుకుబడి గలదు. ఆమె చెప్పినట్లతడు
చుచుండెను విప్లవకారులు గోపాలపురములో చేయనిశ్చయించు
న సాహసకార్యమును ధైర్య స్థైర్య రాశియగు లక్ష్మీబాయియాలో
చించి తనస్నేహితుల నందర నొప్పించెనను నూహ సత్యమే
నుట కెట్టి సందేహమును లేదు". రావుసాహేబుపీష్వా, తాత్యా
పే లీయుక్తికి మహారాణి ననేకవిధముల ప్రశంసింపజొచ్చిరి. వా
స్రుదు నామె సలహాను బూర్తిగ నామోదించిరి. తాత్యాతోపె యిది
గో ననేకసారులు గ్వాలియరు రహస్యముగా వెళ్ళి యచ్చట
ప్పరు యొక్కయు సేనల యొక్కయు మనోగతమును గ్రహించి
యుండును. ఈవార్తవినుటతోడనే పీష్వాసైన్యములోని సరదారు
గూడ కొంత జయాభిలాష జనించెను. ఈవిధముగా మహారాణి
హా ననుసరించిగ్వాలియరుకోటను పట్టుకొనవలెనను కృతనిశ్చయ
తో వారందరును గ్వాలియరుపైకి దండువెడలిరి.

గ్వాలియరు మహారాజా పేరు జయాజీరావు సింధియా. ఈ జయాజీరావు యింగ్లీషు వారిచే నోడింపబడి వారి రెసిడెంటు యాజ్ఞానువర్తియై మెలగుచు పేరుకు రాజ్యమును తానే చేయుచుండెను. ఇతడు బహుబుద్ధిమంతుడు, పరాక్రమవంతుడు. మీరటు, ఢిల్లీ మొదలగు ప్రదేశములలో విప్లవము బయలుదేరుటతోడనే సింధియా సర్కారు సేనలలో గూడ నలజడి బయలుదేరెను. ఇతని సైన్యము 10000 మంది యుండెను. వీరందరును గూడ బ్రిటిషు ప్రభుత్వముపై దిరుగబాటు చేయనుత్సహించుచుండిరి. కనుక జయాజీరా వీసంగతి కనిపెట్టి తన సైన్యములో చాల భాగమును లెఫ్టినెంటు గవర్నరు సహాయము కొరకు ఆగ్రా పంపించెను. మరికొంత భాగము నిటావా ప్రాంతమునకు బంపెను. జయాజీరావు యింగ్లీషువారి కత్యంతస్నేహితుడు. అతని దివాను దినకరరావు రాజకీయ ధురంధరుడు. వీరిరువురును గ్వాలియరులో విప్లవము రాకుండ ననేక ప్రయత్నములను జేయుచుండిరి; చివరకు జూను 14 వ తేదీని సిపాయిలు తిరుగుబాటు చేసి యాంగ్లేయుల భవనముల నంటించి మేజరు బ్లేకు, షెరీఫ్, కప్తను హాకిన్సు, స్టువర్టు మొదలగు నధికారులను చావగొట్టిరి. కప్తను మేక్ఫరుసను రెసిడెన్సీలోనున్న ఆంగ్ల స్త్రీలను, పురుషులను, పిల్లలను పెద్ద సైన్యముతో ఆగ్రాకు బంపివేసెను. ఈ సందర్భములో జయాజీరావు ప్రభుత్వము వారికి చాల సహాయము చేసెను. ఇంతేకాక విప్లవనాయకుల నోడించి వారి ప్రయత్నములను విఫలము గావించెను. విప్లవకారులు సింధియాసర్కారును తమకు నాయకత్వము వహింపవలసినదనియు తన రాజ్యము తనకు సునాయాసముగా రాగలదనియు నెన్నిసారులు చెప్పినను వినక తన ప్రభుభక్తిని బ్రకటించెను. అతడు విప్లవకారుల కెంతమాత్రము నవకాశ మీయలేదు. సేనయంతయు నాంగ్లేయులకు విరోధులుగనే యున్నను జయాజీరావు, మంత్రి దినకరరావు మాత్రమే వారిప్రయత్నములను సాగనీయలేదు. కాని సైన్యమంతయు విప్లవముకొరకెదురుచూచుచుండెను. ఇట్టి సమయములో నొకటి రెండుసారులు తాత్యాతోపె గ్వాలియరు రహస్యముగా బోయియుండెను. అచ్చటి సరదారులందరును సమయము వచ్చి

డు మీకు సహాయముజేయుటకు మేముసంసిద్ధులమై యున్నాము”
వాగ్దానము చేసి యుండిరి.

ఈవిధముగా గ్వాలియరులో నొక అగ్నిపర్వతము లోలోన
జ్వలించుచు సమయము కొరకు నిరీక్షించుచుండెను. వాగ్రోజు విప్ల
ం నొకపక్క నులిమివేసినను మరియొకపక్క నది రాజుచునే
ున్నది. అయోధ్యప్రాంతముననున్న రోహిలాలు, కాల్పినుండి
రిపోయివచ్చిన రావుసాహెబుసేన, సింధియాసర్కారుసేన యీ
డును గలసినచో బ్రిటిషుప్రభుత్వ మెచ్చట నుండెడిదో మనము
ప్పజాలము. కనుకనే గ్వాలియరు రెసిడెంటు మేక్ఫరుసను గ్వాలి
రులో కూడ నొక యాంగ్లసైన్యము నుంచవలసినదని గవర్నరు
రలుకు జాబు వ్రాసెను. ఆసేన వచ్చులోపలనే గోపాలపుర
లో గ్వాలియరుపై దాడుటకు నిశ్చయింపబడి పీష్వాసైన్యము సిం
కూ ప్రభుత్వములోని అమన గ్రామమువరకును వచ్చెను. తాత్యా
ప్పే యింతకుపూర్వము గ్వాలియరు వెడలి దర్బారులోని ముఖ్యుల
దరను కలుసుకొనినట్లు మనము వినియే యుంటిమి. పీష్వాసైన్య
ను వారందరు నాహ్వానించుచునే యుండిరి; రావుసాహెబు పీష్వా
కూజీరావు కిట్లొక జాబు వ్రాసి పంపెను. “నేను నీవద్దకు స్నేహ
వముతోనే వచ్చుచున్నాను. నీవు మన పూర్వపు బాంధవ్యమును
రించుకొని నాకీసమయమున సహాయము చేయవలెను. అప్పుడు
ు దక్షిణముకు పోగలుగుదును.” కాని యీ యుత్తరమునకు సరి
ున సమాధానము నీయక దీనిని రెసిడెంటుకు తెలియజేసి మంత్రి
ున దినకరరావు అకటావికటముగా సంచరించెను. కాని పీష్వా
ధియా తన పూర్వులకు నౌకరనియు, తప్పక సహాయము చేయునని
ు దలంచి మే 27వ తేదీని అమన గ్రామములో బ్రవేశించెను. కాని
ధియారొక్క సుబేదారు కాల్బలమును, అశ్వికదళమును తీసి
ని యతని మార్గమును నిరోధించెను. రావుసాహెబు పీష్వా తన
ోదాను చూపుచు నతని నిట్లు ప్రశ్నించెను. “నన్ను నిరోధించు
ు నీ వెవ్వడవు? సింధియా దినకరరావులకు నేనేమి తెలియజేసితిని?
ి యంతర మేమి? నా యంతర మేమి? నన్ను వా రెట్లు నిరో

ధించగలడు! నేను రావుపంతు ప్రధాన పీష్వానని నీవు గుర్తెరుంగ వలెను. నేను స్వరాజ్య, స్వధర్మముల కొరకు రణకంకణమును ధరించి యున్నాను. సింధియాయొక్క పూర్వులు మాకు చాకిరీచేసిరి. మేమే యతని కీరాజ్యము నిచ్చితిమి. సింధియా సేన యంతయును మాలో కలసిపోయెను. ఆసైన్యాధికారులనుండి నావద్ద కాహ్వానపత్రములు వచ్చెను. తాత్యాతోపె ముందుగా గ్వాలియరుకు బోయి యధికారుల నందరను గలుసుకొని వారి మనోగతములను దెలుసుకొని వచ్చెను. కనుక మేమిప్పుడు తయారై వచ్చితిమి.

మాతో యుద్ధము చేయవలెనని నీ కేమైనను కోరికగలదా?" రావుసాహెబు పీష్వాయొక్క యీ గంభీరవచనములను విని యా సుబేదారు మాట్లాడజాలకపోయెను. పైగా పీష్వాయొక్క ప్రచండ సేనతోపోరి లాభములేదనికూడ యతడు గ్రహించి యుద్ధప్రయత్న ములను విరమించుకొనెను. పీష్వా సైన్యము మే 30 వ తేదీని గ్వాలి యరు కారు మైళ్ల దూరముననున్న బడాగావు అను చోట విడిసెను.

పీష్వాసింధియా సర్కారుకు వ్రాసినయుత్తరముమీద వాదోప వాదములు జరిగెను. సింధియాయొక్క సరదారు లందరు పీష్వాకు సహాయము చేయవలెననిరి. ఒక్క దినకరరావు, జయాజీరావులు మాత్రమే పరప్రభుత్వదాస్యమున కొడిగట్టిరి. పీష్వాకును తనకును గల ప్రాచీనసంబంధమును గాని స్వధర్మ, స్వరాజ్యాశయముల కొరకు పీష్వా పోరుచున్నాడను దృష్టిగాని సింధియా కంతమాత్రమును లేకపోయెను. అతడు విప్లవకారుల కట్టి సహాయమును జేయకపోవుట యేగాక వారితోపోరి వారినోడించెదనని శపథము చేసెను. అతడు వెంటనే పొలిటికలు ఏజంటు మేక్ఫరుసను కీవిషయములను తెలియ పరచి యింగ్లీషుసేనలు వచ్చువరకును తాము విప్లవకారులతో యుద్ధము నకు దలపడక పట్టణమును జాగ్రత్తగా కాపాడుకొనుచు యిరువురును కలసి వారిపై నొక్కసారి పడవలెనని నిశ్చయించుకొనిరి. కొద్దిమంది మహారాష్ట్రసిపాయిలను మాత్రము పీష్వా మార్గము నడ్డగించుటకు బంపిరి. కాని సింధియాయొక్క సరదారులు కొందరు వెంటనే

ష్వాతో యుద్ధము చేయవలెనని ప్రోత్సహించిరి. దినకరరా విది
దని వారించుచున్నను జయాజీరావు వినక సమరసన్నాహములను
వించి స్వయముగా తాను యోధవేషమును ధరించి మొలకు ఖడ్గ
ను వ్రేలగట్టి గుఱ్ఱముపై నెక్కి తన సర్వసేనలను దీసికొని జూన్
టవ తారీఖున బహాదరుపుర మను గ్రామమున విప్లవకారులతో
పడుటకు సిద్ధ మయ్యెను. అతనివద్ద నారువేల కాల్బలమును
న్నెండువందల గుఱ్ఱపుదళమును యేడు పెద్ద పెద్ద ఫిరంగులును
ండెను. అతడు సేనకంతకును క్రమమైన శిక్ష నొసగెను. అతని
ంగులకు ప్రాచీన ప్రాశస్త్యముగలదు. విప్లవకారుల నొక్కసారి
ల్చివేయవలెనని యతడీ ఫిరంగుల నన్నిటికంటెను ముందు పెట్టించె
వెంటనే వేలకొలదిగుండ్లు పీష్వా సైన్యముపై గురిపింపబడెను.
వుసాహెబు పీష్వా తాత్యాతోపే లిద్దరును సింధియామహారాజు
తో యుద్ధమునకు డీకొనునని తలంపరైరి. ఈగుండ్లు తమ గౌరవా
ర్థమునకై పేల్చుచున్న నమస్కారములు (Salutes) అని వారను
ని యుద్ధమున కాజ్ఞాపింపలేదు; ఇంతలో సింధియా ఫిరంగులను
ర్పించుచు పీష్వాసైన్యమును సమీపించుచుండెను. పీష్వాసైన్యములో
కలము బయలుదేరెను. రావుసాహెబు పీష్వా కీసంగతి తెలియుట
డనే విచారాక్రాంతుడై కర్తవ్యవిమూఢుడై యుండెను.

కాని సహసాత్రీవలె సదా మేల్కొనియే యుండు లక్ష్మీ
యి యావంతయు చలింపక సైన్యముల నాయత్తము జేయుచుండెను.

మహారాణి రావుసాహెబు పీష్వాను ప్రోత్సాహపరచి
తనిని గ్వాలియరుపైకి తీసికొనివచ్చినను సైన్యమంతయు నామె
ధీనములో లేదు. ఆమె నిరుపమాన ధైర్య, శౌర్యములనుజూచి పీష్వా
గామె సలహా తన కవసరమగుటచే దీసికొనెనేగాని యామె చెప్పిన
ంతయు చేయుచో దనప్రతిష్ఠకు భంగము వచ్చునని దురభిమానపూరి
డై యట్లు చేయకుండెను. కనుకనే యీసమయమునకూడ పీష్వా
న్యములో క్రమమేమియును లేకపోయెను. అయిన నీవార్తవినుట
డనే లక్ష్మీబాయి తనతో రెండుమూడువందల అశ్వదళమును దీ

కొని యత్యంత రయమున సుప్రతిష్ఠితసింగి చందమున సింధియా సైన్యముపై
బడెను. తాత్యాతోపె కూడ తన సైన్యమును భిన్న భిన్న భాగములుగా
విభజించి శత్రుసైన్యములను మార్కొనెను లక్ష్మిబాయి సుశిక్షిత
మగు తనసైన్యమును దీసికొని సింధియాఫిరంగులపై బడుటతోడనే
వారు పికాపికలై పరువిడనారంభించిరి. సింధియా తరపున పోరుచున్న
మరియొక సైన్యముగూడ తాత్యాతోపె సేనలను జూచుటతోడనే
పలాయనమయ్యెను. కాని జయాజీరావు చాలశూరుడు. అత డావేళ
ముతో దనసైన్యమును ముందుకుదీసికొనివచ్చి విప్లవసైన్యముతో హోరా
హోరీగ పోరాడసాగెను. ఒకప్రక్క శూరాగ్రేసరుడగు నొక
రాకుమారుడు పదునేండువందలమంది జగజెట్టీలవంటి సిలేదారుపటా
లముతోయుద్ధముచేయుచుండెను. మరియొకప్రక్క దైవోపహతుగాలగు
నొక యనాథబాలిక రెండమూడువందల రణకుశలురతో యుద్ధమునకు
దలపడెను. జయాజీరావుప్రభుభక్తితత్పరుడై పోరుచుండెను. లక్ష్మీబాయి
స్వరాజ్య, స్వధర్మ పతాకములకొరకు ప్రాణముల నర్పింపనుండెను.
ఇట్లిరుపక్షములవారి కరవాలములును గొంతసేపు నర శిరో ఖేలనతత్ప
రమై యుండెను. సింధియాయొక్క సేన లచిరకాలములోనే యల
సట జెంది వెనుకాడుచుండ లక్ష్మిబాయియొక్క వీరు లుక్కుదక్కు
శత్రుసేనలను స్వాహా చేయ నారంభించిరి. ఇక లాభము లేదని
గ్రహించి జయాజీరావు దివాను దినకరరావు మొదలగువారిని వెంట
బెట్టుకొని ధౌల్పురమార్గమున ఆగ్రాకు పారిపోయి మిత్రులగు
ఇంగ్లీషువారి శరణుజొచ్చెను.

ఈ వార్త గ్వాలియరులో తెలియగనే రాజమహాలులోని
వారందరు హాహాకారములు చేయ నారంభించిరి. అంతఃపుర స్త్రీలు
ఆత్మ రక్షణార్థమై నరవరయను గ్రామమునకు పారిపోయిరి. విప్లవ
కారు లత్యుత్సాహముతో గ్వాలియరు పట్టణములో బ్రవేశించిరి.
గ్వాలియరులోనున్న సరదారులు, రాజనీతి కోవిదులు తదితర సిపా
యిలు మొదలయిన వారందరును గూడ తమయానందమును వెలి
బుచ్చ నారంభించిరి, వెంటనే గ్వాలియరు సేనలన్నియు పీష్వానాహ్వా

ుచు నమస్కారార్థము Salutes) ఫిరంగులను పేల్చుచుండిరి.
్ర సాహేబు పీష్వా రొట్టియాటంకమును లేకుండ పట్టణము నతి
వముతో బ్రవేశించెను. ప్రజలందరు నతనినే తమ ప్రభువుగ
రించి యానందమున నోలాడుచుండిరి. పీష్వా రాజమహాలులో
వేశించి జయపతాకను నచ్చట స్థాపించెను. మహారాణి లక్ష్మి
ము 'నవల్ఖా' యను తోటలో విడిది చేసెను. తదితరు లందరును
న భవనముల నాక్రమించుకొనిరి. ఈ విధముగా పీష్వాకు సునా
ాసముగా సింధియా యొక్క రాజధాని లభ్యమయ్యెను. స్వధర్మ
రాజ్యాదర్శకమైన జెండా యెత్తబడెను.

ఈ విధముగా పట్టణము నాక్రమించుకొనిన తరువాత తాత్యా
పైకి కొంత సైన్యమును పంపెను. కోటలోని యధికారులందరు
తరకే తాత్యాతో నేకమగుటచే కోట సునాయాసముగా నతని
మయ్యెను. తాత్యా వచ్చుటతోడనే దుర్గమద్వారము లన్నియు
నికొరకు తెరచివేయబడెను. కాని దుర్భేద్యమైన గ్వాలియరు
తి కోటయు, నగణిత యుద్ధసామగ్రియు, సైన్యమును విశేషధన
ను తమ యధీన మగుటచే తాత్యాకు కొంత గర్వము కలిగెను.

విప్లవకారులు పట్టణములో బ్రవేశించుటతోడనే ఆంగ్లాధి
రి యుండు రెసిడెన్సీని తగులబెట్టిరి. అందులోనున్న సామగ్రి
ంతయు దోచుకొనిరి. సింధియా సర్కారుయొక్క పురాణరాజ
హాలు, ఆంగ్లాధికారుల భవనములు, దినకరరావు మొదలగువారి
వేళీలు మొదలైనవి మట్టిపాలు చేయబడెను.

ఈ ప్రకారముగ గ్వాలియరు విజయముపూర్తియగుటతోడనే
ధియా యధికార మంతరించి పీష్వాయధికారము స్థాపింపబడెనని
ూచించు విజయధ్వానములు చెలరేగెను. దర్బారులోని గొప్పగొప్ప
ర్దారులును, జాగీరుదారులును, సైన్యాధికారులును రావింపబడిరి.
ంధియా సర్కారు ఖైదుచేసిన విప్లవ సరదారులు నలుగురును విడి
ంపబడిరి. తమ మిత్రకోటిలోనివారగు నితరరాజుల కాహ్వానము
ంపబడెను. మూడవ తారీఖున "పుష్పవనము" అనుచోట గొప్ప

దర్బారు జరుపబడెను. సరదారులు, జాగీరుదారులు, సైన్యాధికారులు మొదలగువారందరు తమ తమ స్థానముల నలంకరించిరి. తాత్యాతోపె మొదలగు యోధులు యోధవేషములను ధరించి హాజరైరి. మంగళవాద్యములు మ్రోగుచుండ వందిమాగధులు స్తోత్రములు చేయుచుండ పీష్వా యత్యంత వైభవముతో రాజదుస్తులను ధరించి రత్నకిరీటమును, శిరోపింఛమును దాల్చి మణి, కంకణ హారవిభూషితుడై శుభముహూర్తమున సింహాసనాసీనుడయ్యెను. అనేక వస్త్రాభరణములు బహుమతులీయబడెను. రామారావు గోవిందు అను నొక ప్రధాన మంత్రికి వస్త్రము లియ్యబడెను. తాత్యాతోపె సేనాపతిగా నియమింపబడెను. అతనికొక రత్నస్థగిత ఖడ్గము బహుమతి చేయబడెను. తరువాత ఎనమండుగురు ప్రధానులుగా నియమింపబడిరి. సైనికుల కిరువదిలక్షల రూపాయిలు పంచిపెట్టబడెను. పట్టణమంతయు కోలాహలముగా నుండెను. ఎచ్చట జూచిన నానందమయముగ నుండెను. సింధియాసర్కారు జాగ్రతతో గూడబెట్టిన ధనమునంతను రావుసాహేబతిహుషారుగా ఖర్చు పెట్టుచుండెను. ఇక నిత్య బ్రాహ్మణ సంతర్పణలవిషయమై వర్ణింప నలవిగాకుండెను: పాకశాలలో వెయ్యి మంది వంటబ్రాహ్మణు లహర్నిశములు పనిచేయుచుండిరి. పంచభక్ష్య పరమాన్నములతో షడ్రసోపేతములైన భోజనము లమర్పబడుచుండెను. రాజమహలులో నీప్రకారము నిత్యము నూతనోత్సవములతో నిత్యకళ్యాణము పచ్చతోరణముగా 'షెల్లు' మనుచుండెను. రావు సాహేబు పీష్వా తాత్యాతోపె మొదలైనవా రదిరళి సంతోష వారధిలో మునిగి కర్తవ్యజ్ఞానమూఢులై ప్రవర్తించుచుండిరి. ఈ యకర్తవ్యవహారమునకు లక్ష్మీబాయి యెంతయు దుఃఖాక్రాంతురాలై రావు సాహేబు ననేక పర్యాయము లిట్లు వారించెను. "మీరీ సమయమున నిట్టి భోగములను కట్టిపెట్టవలెను. ఆనందముతోను, ఉత్సవములతోను కాలము వృథపుచ్చుట కిదిసమయముగాదు. ఇది రణభేరులతోను, సమరసన్నాహములతోను శత్రువు నెదుర్కొనవలసిన తరుణము. మీరీ సమయమున విజయోన్మత్తతచే నానంద నిమగ్నులై యున్నారు. ఇదెంతమాత్రమును యోగ్యముకాదు. సింధియా యొక్క ఖజానా

మంతయును సర్వసేనలును మీ యధీనములో నున్నవి వీనిని
నము సరిగా నుపయోగించుకొనియెడల మన యాశయములన్నియు
ూడిద పాలగును. ఆంగ్లేయులు చాకచక్యము గలవారు. వారు
మ ప్రయత్నముల నెన్నడును విడుచువారు కారు. వారు మనపై
ఏ నిమిషమందు వత్తురో మనము చెప్పజాలము. మనమిట్లు స్తబ్ధులమై
డియుందుమేని మననాశమున కెంత కాలమో పట్టదు. కనుక
ారిప్పు డిట్టి యుత్సవములను కట్టిపెట్టి సేనలను తయారు చేయుట
ుందు తత్పరులు గావలెను. సైనికుల నెక్కువగా నాదరించి వారి
త్సాహము కలుగ జేయవలెను. ఇట్టి సమయమును వృథా వ్యయ
రచరాదు. మన మనేక కష్టములను పడి కార్యసాధన కనుకూలించు
ట్టి తరుణమును బడయ గలిగితిమి. కనుక మనము సావధానముగా
ట్టిసమయమున యుద్ధప్రయత్నములను జేసికొనుటే ప్రధానకర్త
్యము". కాని రత్నములవంటి యీ పలుకులన్నియు చెవిటివాని
ుందు శంఖూదినట్లయ్యెను. పీష్వా బుర్రకివి యెక్కలేదు. "భ్రష్ట
్య కావాగతిః" అనినట్లు వారు యథాప్రకారముగా నుత్సవముల
ోను బ్రాహ్మణ సంతర్పణలతోను సంతృప్తిపడుచుండిరి. తాత్యా
ోపెకూడ తన సైన్యమును జూచి మురియుచుండెను. ఆంగ్లేయులు
న సేనతో యుద్ధము చేయజాలరనియే యతడు భావించుచుండెను.

కాల్పీయుద్ధమైన తరువాత సర్ హ్యూరోజు మిగిలిన విప్లవకా
ుల నందరను నాశనముజేయుట కేర్పాటులను గావించి బొంబాయి
చేరిన సంగతి వినియేయున్నారము. కాని విప్లవకారులు గ్వాలియరు
ప్రవేశింప నున్నారను వార్త యతనికి జూన్ ఒకటవ తేదీని తెలి
సెను. ఈ వార్త వినుటతోడనే యతడత్యాశ్చర్యపడెను. వెంటనే
యతడు చాలమంది తెల్లసిపాయిలను, నేటివు సిపాయిలను, అశ్విక
దళములను యిచ్చి మేజరు స్టువర్టు, మేజరు రాబర్టుసన్ లను బంపిం
చెను. కాని వారు గ్వాలియరు జేరకమునుపే గ్వాలియరు జయింప
బడుటయు మహారాజుగారు పారిపోవుటయు జరిగెను. ఈ వార్త
వినుటతోడనే రోజుదొర దుఃఖాక్రాంతుడయ్యెను. అతడుపడిన

కష్టమంతయు వృథయై నట్లతనికి గాన్పించెను. వెంటనే యతడు వెనుకకు దిరిగి విప్లవకారుల నోడించుటకు ప్రబల ప్రయత్నములను గావించెను. “ఈయుద్ధములో సర్ హ్యూగ్రోజు వంటి రణపండితుడును యుద్ధకళానిపుణుడును లేనిచో పీష్వాచే పునరుజ్జీవితము గావింపబడిన మహారాష్ట్రాధికారము దక్షిణదేశ మంతటను విజృంభించి మన కట్టి దుస్థితి పట్టెడిదో యూహింపజాల” మని మేలిసను వ్రాయుచు న్నాడు. రోజుదొర వెంటనే సర్వసైన్యాధిపత్యము వహించి గ్వాలియరుపై సేనలను నడిపించెను. ఆంగ్లసేనలు సరాసరి గ్వాలియరు సమీపముననున్న మురారిగ్రామము వచ్చి చేరినను రావుసాహెబునకు గాని తాత్యాకుగాని యీసమాచారమే తెలియకుండెను. వారి యానందములో వారుపడి కొట్టుకొనుచుండిరి. మురారిలోనున్న సేనయంతయు సింధియాసర్కారు సైన్యము. ఈసైన్యమంతయు విప్లవకారులలో గలసిపోయెను. ఈ సైన్యములో మరఫిరంగులు, అశ్వికదళము, కాల్బలము మొదలగు యుద్ధసామగ్రియంతయు నుండెను. ఇవిగాక గ్వాలియరుసేనలో రోహిలాలు, పఠానులు మొదలగు యుద్ధవిశారదులు గూడ గ్వాలియరు సేనలో నుండిరి. కాని యెన్ని యున్ననేమి! పీష్వా, తాత్యాతోపే అంధప్రాయులై యిట్టి పరికరముల నుపయోగించుకొనక విందుల నారగించుచుండిరి. ఛత్రపతి శివాజీమహారాజు, బాజీరావు, నానాఫడ్నవీసు మొదలగు మహారాష్ట్ర శూరులందరును దమతమ సైనికుల బాహుబలముచేతను, బుద్ధినైపుణ్యము చేతను, మహారాష్ట్ర ప్రభుత్వమును అటక్ వరకును స్థాపించియుండ రావుసాహెబు పీష్వా దానధర్మములచేతను, బ్రాహ్మణ సంతర్పణలచేతను స్వరాజ్యపతాకమును స్థాపింపబూనెనుకాబోలును! చిట్టచివర కాంగ్లసేన వచ్చుచున్న సంగతి తెలిసిన తరువాత పీష్వా తాత్యాతోపేను పిలచి సేనలను తయారుజేయుమని యాజ్ఞాపించెను. తాత్యాతోపే స్వయముగా యుద్ధనిపుణుడను సంగతి మన మిదివరకే గ్రహించి యున్నాము. కాని యితడు గూడ పీష్వాతో విజయోత్సవములతో మత్తెక్కియుండెను, పీష్వా పట్టాభిషిక్తుడయ్యెను. కనుక నింగ్లీషువారు తమపై యుద్ధమునకు వచ్చుచో [illegible] రాజులందరును వచ్చి

తమకు సహాయము చేయుదురని యతడు తలంచెను. కాని యీసమయము నందు దమకు సహాయము చేయువారెవరును లేరను సంగతి యతనికి తెలియుటతోడనే తాత్యా తెలివి తెచ్చుకొని యోధవేషమును ధరించి ప్రతిచోటను ఫిరంగులకొరకు వేదికలను గట్టుట కాజ్ఞాపించెను. అతడు స్వయముగా మురారి పరువెత్తి దానిని రక్షింప బ్రయత్నించెను. అతని ప్రయత్నములు నిష్ఫలమయ్యెను. సర్ హ్యుగ్రోజు అకస్మాత్తుగా మురారి పై బడుటతోడనే అచ్చటనున్న సైనికులు భయభ్రాంతులైరి. మురారి లోనున్న సైనికులలో కొందరు సింధియాకు విరోధులైన వారుండిరి. వీరు బహుపరాక్రమముతో యుద్ధముచేసిరి. విప్లవకారులలో గూడ కొందరు శూరులు వెనుదీయక పోరాడిరి. ఇట్లు రెండుగంటలవరకును ఘోరయుద్ధము జరిగెను. చివర కాంగ్లేయులే గెలిచిరి. విప్లవకారులు మురారి విడిచి పారిపోవుటతోడనే యింగ్లీషువారు దానిని స్వాధీనము చేసికొనిరి.

ఈసమాచారము గ్వాలియరులో తెలియుటతోడనే అందో ళన బయలుదేరెను. రావుసాహెబు పీష్వా కిప్పుడు తెలివివచ్చెను. అతడు తన సైన్యమున కుత్తేజమును కలిగించుటకు పైకివచ్చెను. బాందానవాబు కూడ పట్టణముయొక్క బురుజులను బందోబస్తు చేయుటకు బయలుదేరెను. తాత్యాతోపే యదివరకే మేలొ్కని సేన లను కూర్చుచు ఫిరంగుల నన్నిచోట్ల నమర్చుచు అశ్వికదళమును, కాల్బలములను యథాస్థానముల నియోగించుచు భిన్నభిన్న సైన్యములను వివిధప్రదేశము లందతి త్వరత్వరగా యుద్ధప్రయత్నములను జేయుచుండెను. అతడు మహారాణి లక్ష్మీబాయిని సమీపించి యామె మోల వినమ్రుడై నిలచి "తల్లీ! యిదివరలోవలెనే నీవు మాకీయుద్ధ మందు గూడ సహాయమును జేయ వేడుకొనుచున్నాను" అని పలికెను.

ఈ వచనములు వినుటతోడనే మహారాణికి దుఃఖమువచ్చెను. ఆమె పీష్వా తాత్యాలతో సైనికశిక్షణమును గురించి యెన్నిసారులు చెప్పినను వారు పెడచెవినిబెట్టి పీష్వాపదవిని పునఃప్రతిష్ఠించుచు మహోత్సవములలో నిమగ్నులై కార్యసిద్ధి కదనగుకాలము నైశ్వర్యోపభ

భోగములలో గడిపివేసి ఆత్మనాశమును, భారతదేశదాస్యశృంఖల ములను దెచ్చిపెట్టిరి. ఇట్టివిచార మామెహృదయమును వ్రక్కలు జేయుచుండ "భారతదేశమా! నీకింకను శుభదినములు పట్టలేదు. అట్లు కానిచో మావంటి నిర్భాగ్యులు నీకడుపుచిచ్చుకొఱకేల దాపరింతురు?" అని విలపించుచు ప్రొద్దుపుచ్చుచుండెను. తాంతియాతోపే సందేహ మనస్సుతోను దైన్యవాణితోను ఆమెను పదేపదే ప్రార్థింపనామె ఇట్లు పలికెను. "సహస్రోపాయములను గనిపెట్టి నిరంతరపరిశ్రమ చేయుచు నేటివరకు మనము చేసినకృషియంతయు నిష్ఫలమగుసూచ నలు నాకు గాన్పించుచున్నవి. నేనుచెప్పిన సలహాయంతయు పీష్వా యొక్క దుర్భిమాన దురాగ్రహములచేతను, విజయోత్సాహము చేతను బూడిదలో పోసిన పన్నీరువలె వ్యర్థమాయెను. ఆంగ్లసేనలు మన నెత్తిపై వచ్చిపడుచున్నను మనమింకను సరియైన సమరసన్నాహము లను గావింపలేదు. శిక్షణయెంతమాత్రము లేని యిట్టి సైన్య ముతో మనమాంగ్లేయులతో పోరి యశమును సంపాదింపజాలము. కాని యిట్టిసమయములో మనధైర్యమును విడనాడినను లాభములేదు. మీరు మీమీ సైన్యములను యుద్ధసన్నద్ధులనుజేసి నలువైపులను నిపుణులగు సరదారులనుంచి తగిన బందోబస్తు గావించి ఆంగ్లసేనల మార్గమును నిరోధింపుడు. నేను నాధర్మమును నెరవేర్చుట కెప్పుడును సిద్ధముగానే యున్నాను. మీరు మీకర్తవ్యమును మాత్రము విస్మరింపకుడు."

ఈమాటలను వినుటతోడనే తాంత్యాతోపేకు నూతనోత్సాహము కలిగెను. ఆమె మాటల నతడు శిరసావహించి గ్వాలియరుకు తూర్పుభాగమును రక్షించుభారము నామెకిచ్చివేసి తనసేనలతో మరియొకవైపునకు పోయెను.

మహారాణి లక్ష్మీబాయి యిదియే తన యంతిమ యుద్ధమని గ్రహించి యద్వితీయ రణోత్సాహముతో దనసేనల నతిత్వరితముగా రణోన్ముఖులను గావించెను. ఆమె తన మామూలు రౌద్రవేషమును ధరించి, యుత్తమాశ్వము నధిరోహించి శత్రుసంహారకేళియం దసమాన

శాత్రూహాలమును బ్రదర్శించు తన ప్రాణతుల్యమగు రత్న స్థగిత కరవాలము నొరనుండి యూడబెరికి సైనిక నివహంబులకు శిక్షను గఱప నారంభించెను. ఆసమయమందలి యామె దివ్య స్వరూపమును, గంభీరస్వరమును, స్వధర్మ స్వదేశాభిమానములను జూచి యామె సైనికు లావేశపూరితులగుచు శత్రుసంహారోత్సుకతను బ్రదర్శించుచుండిరి.

బ్రిగేడియర్ స్మిత్ మేజరుహార్ లిద్దరును హ్యూరోజు యొక్క ఆజ్ఞానుసారము గ్వాలియరు కైదుమైళ్ళ దూరములో నున్న కోటా సరాయి యను గ్రామమున తమ సేనలను నిలిపి యచ్చటనుండి పట్టణముపై బడుటకు నిశ్చయించిరి. వీరిద్దరును గ్వాలియరు సేనలయొక్క వ్యూహరచనను బరీక్షింప నారంభించిరి. అవైపునున్న సేనలు మహారాణి యధీనములో నుండెను; ఫిరంగులకొరకు వేదికలంతటను స్థాపింపబడెను. పర్వతము యొక్క నిమ్నోన్నత ప్రదేశములలో సేనలు క్రమ శిక్షణలో నుంచబడెను. అభేద్యమైనవ్యూహము పన్నబడెను. శౌర్యసాహస సంపన్నులగు వీరు లగ్రభాగమున నుండిరి. వారివెనుక కొద్ది దూరములో అశ్వికదళము, కాల్బలము మొదలగున వతిచమత్కారముగా కూర్చబడెను! తక్కిన యుద్ధ ప్రదేశములన్నియు సరికట్టబడెను. ఒక యెత్తైన ప్రదేశములో గొప్ప గొప్పఫిరంగు లమర్చబడెను. ఈ వ్యూహము దాటి ఆంగ్లేయులు పట్టణమును బ్రవేశించుట దుస్సాధ్యముగా నుండెను. పదహారవ తారీఖున బ్రిగేడియరు స్మిత్ యుద్ధమును ప్రారంభించెను. ఆంగ్లసేనలు ముందుకు బయలుదేరుట తోడనే లక్ష్మీబాయి తన ఫిరంగి ప్రేటుకాండ్రను హుషారు చేసెను. వెంటనే ఫిరంగి వర్షము కురిసెను. దానితో నాంగ్లసేనలు చెల్లాచెదరై వెనుకకు మరలెను. లక్ష్మీబాయి యొక్క రణశూరులగు సరదారులును, ముసల్మానులును ముందు కురికి యాంగ్లేయులపై బడి ఘోరయుద్ధము చేసిరి.

ఆంగ్లేయుల గుఱ్ఱపుదళము మహారాణి సైన్యముపై నత్యావేశముతో పడెను. మహారాణి సరదారులు వారి నెదిర్చిరి; సంగ్రామ

మతిభీకరముగా నుండెను. ఇరుపక్షముల వారును తమతమ పరాక్రమ
మును జూపుచుండిరి. మహారాణి సైనికులు ప్రాణములను త్యజించి
కృపాణపాణులై విజయశ్రీని సాధించు తమకంబున శత్రుగణముపై
కురికిరి. తల్వారుల ఝణాఝణధ్వనులు మారుమ్రోగెను. ఆంగ్లసేనలు
ప్రాణముల నఱచేతులలో నుంచుకొనిరి. ఇంతలో కలనల్ రేన్సు,
కలనల్ హేలీలు తమ సైన్యములను దీసికొని, బొంబాయి నేటివు
కాల్బలమును ముందుంచుకొని మహారాణి సైన్యముయొక్క పృష్ఠ
భాగముపైబడిరి. మహారాణి సైన్యము నలువైపులను యుద్ధము చేయ
వలసివచ్చెను. ఆంగ్లసేన లసంఖ్యాకముగా వచ్చుచుండెను. లక్ష్మీ
బాయి సైన్య మతికొద్దిగా నుండుటచే వెనుకకు తగ్గవలసివచ్చెను.

కలనల్ రేన్సు, బ్రిగేడియర్ స్మిత్ మొదలగువారీ సమయ
మును గనిపెట్టి తమ తమ గుఱ్ఱపుదళములను దీసికొని శత్రుసైన్య
మును చీల్చివేసి ముందుకు పోవలెనని ప్రయత్నించుచుండిరి. తన
సైన్యము వెనుకబడిన సంగతి లక్ష్మీబాయి చూచుటతోడనే యామె
తన యశ్వము నురికించుకొనుచు కరవాలము నాకాశమండలమున గిర
గిర ద్రిప్పుచు సైన్యమున కగ్రభాగమున నిలిచి మేఘ గంభీర స్వర
ముతో సైనికులను ప్రోత్సహింప వారు సంగ్రామదేవతయగు లక్ష్మీ
బాయిచే ద్విగుణీకృతోత్సాహులై పోరసాగిరి. ఈవిధముగా మరల
తుములయుద్ధము జరిగెను. మహారాణి సైన్యము కొంచెమైనను వారం
దరును వీరులు; క్రమశిక్షనొంది మృత్యువు నాలింగనము జేయవచ్చిన
ధీరులు. రావుసాహెబు పీష్వా, తాత్యాతోపెలు పెద్ద పెద్ద సైన్య
ముల ప్రోగుచేసి పట్టణమును మరియొక వైపునుండి రక్షించుచుండిరి.
కాని వారి సైన్యము లెంత పెద్దవియైనను క్రమశిక్ష లేదయ్యెను.

పదిహేడవ తారీఖున ఆంగ్లసేనలు గ్వాలియరు నన్నివైపుల
నుండియు నొక్కసారి ముట్టడించి జయించవలెనని చాల ప్రయత్న
ములను గావించెను. బ్రిగేడియరుస్మిత్ కోటాకీ సరాయి గ్రామము
వైపునుండి శత్రుసేనలను చీల్చుకొని గ్వాలియరుపై బడవలెనని
ముందుకు బోవుచుండెను. వెంటనే మహారాణివారి నడ్డగింప తనసేనల

ంజ్ఞాపించెను. నాలుగు మూలలనుండియు రణభేరులు మ్రోగి యా కా
శమును చిల్లులుపడ జేయుచుండెను. మహారాణి యాశ్వికదళము తమ
యుద్ధనైపుణ్యమును జూపుచు రాణిని మెప్పించవలెనని యొక్కు
మ్మడి ముందు కురికి ఆంగ్లేయులతో ఛాతీలను గలిపి ఘోరయుద్ధ
మొనర్చిరి. ఈసమయమున మహారాణి వదనకమలము క్షాత్రతేజ
ముతో నుట్టిపడుచుండెను. ఆమె నేత్రద్వయము దేదీప్యమానముగా
ండ క్రోధవహ్నిని గ్రక్కుచు నిజసైన్యము నుత్సాహపరచు
ుండెను. ఆరోజంతయు భయంకరయుద్ధము జరిగెను. చాలమంది
ంగ్లశూరులు యుద్ధములో యమసదనమున కంపబడిరి. బ్రిగేడి
రు స్మిత్ కూడ నతిధైర్యముతో బోరెను. రణగర్జనములు మిన్నంటు
ండెను. ఆకాశమండల మంతయు ధూళిధూసరమై కారుచీకట్లు
్రమ్మెను. ఇరుపక్కల యోధులును నేల గూలుచుండిరి. ఈయుద్ధ
లో గొప్ప గొప్ప ఆంగ్లవీరులందరును హతాశులై దుర్భేద్యమైన
క్ష్మీబాయి వ్యూహమును ఛేదించుట దుర్లభమని గ్రహించుటతోడనే
యుద్ధమును మాని వెనుకకు మరలిరి.

పదునెనిమిదవ తేదీని మరల యుద్ధము ప్రారంభమయ్యెను

లక్ష్మీబాయి శౌర్యము నాంగ్లయోధులు మరువజాలకుండిరి.
కనే వారు మరియొకవైపునుండి గ్వాలియరుపైబడ నుంకించు
ండిరి. ఇంతలో కలనల్ రేన్సుగూడ వచ్చిస్మిత్‌ను గలుసుకొనెను.
రిరువురును తమతమసేనలతో నతిచాతుర్యముగ వ్యూహముల నేర్పరచి
శ్వికదళమునే శత్రువులతో బోరుటకు ముందుంచి కలనల్ హిక్సు,
ప్తను హేనేజు మొదలగు వీరులను తీసికొని శత్రువు నణచివేయ
లెనని మహావేగముతో బయలుదేరిరి. ఆంగ్లాధికారు లందరును
యుద్ధసన్నద్ధులై శత్రువును స్వాహాచేయవలెనని యూటలూరుచుండిరి.
క్ష్మీబాయికూడ పూర్తియైన ప్రయత్నములనే గావించెను. ఆమె
ోధవేషమును ధరించి శిరమున కుచ్చుతలపాగజుట్టి సఫేదుఅంగరకా
రించి, పాయిజామా తొడుగుకొని, కంఠసీమను ముత్యాలహారము
లంకరించుకొని తనయశ్వరాజము నధిరోహించి రణచండికవలె

కరాళ కరవాలధారాప్రభచే సేనలను వధించుచుండెను. ఆంగ్లేయులు నలువైపులనుండియు గ్వాలియరుపైబడిరి. సర్ హ్యూరోజు ఒకవైపునుండి వచ్చెను. బ్రిగేడియరు స్మిత్ మరియొకవైపునుండి ప్రచండసేనతో మహారాణి ననేకవైపులనుండి ముట్టడించుచుండెను. మహారాణి తనవీరులను వెంటబెట్టుకొని యావేశముతో బోరుచుండెను. ఆంగ్లేయులుకూడ శౌర్యమును జూపసాగిరి. ఈసమయమున లక్ష్మీబాయి మేఘమండలమును భేదించుకొని మెరయు మెరపుతీగవలె యుద్ధరంగమున మెరయుచుండెను. ఆమె శౌర్యసాహసములకు మేరలేకయుండెను. ఆంగ్లాధికారులుకూడ వెనుదీయక పోరుచు ముందుకు బోవలెనని యావేశమున వచ్చుచు నిలిచిపోవుచుండిరి. ఒకరికొకరు దీసిపోవుటలేదు. ప్రజలు హతాశులగుచుండిరి. ఆకాశమండలము ధూళిధూసరముతో గప్పబడెను. సూర్యభగవాను డదృశ్యమగుచుండెను. కాని విజయలక్ష్మి యెవ్వరికిని సంప్రాప్తించుటలేదు. సర్ హ్యూరోజు మురారివైపునుండి రావుసాహేబు పీష్వాయొక్క రెండు ఫిరంగులను ధ్వంసముచేసెను. ఈవార్త లక్ష్మీబాయి సైనికులకు గొంత యలజడి కలిగించెను. ఆమె కాల్బలసరదారు లెందుచేతనోగాని వెనుదీయుచుండిరి. వారులక్ష్మీబాయితో గలిసిన సింధియాప్రభుత్వముయొక్క సైనికులు. కాని లక్ష్మీబాయి గుఱ్ఱపు దళముమాత్రము హిమగిరివలె నట్టియుండి యుద్ధమును మరింత యుత్సాహముతో చేయుచుండెను. చాలమంది యోధు లపారపారావారముగా వచ్చిపడుచున్న ఆంగ్లఫిరంగుల కెరయగుచున్నను వెనుకనున్న కాల్బలమును, ఫిరంగులును తనప్రక్కనే యుండునని యామె తలంచుచుండెను, కాని ఈయాశ నిరాశయయ్యెను. యుద్ధ మతి తుములముగా నున్న సమయమున నామెకు దన ప్రాణతుల్యమును, బాల్యస్నేహితురాలునునైన కరవాలము దప్ప మఱొండు సహాయము లేదయ్యెను.

బ్రిగేడియర్ స్మిత్ మరియొక వైపునుంచి మహారాణి కాల్బలముమీదకును, ఫిరంగులమీదకును కలనల్ హిక్సు, కప్తను హేనేజిలను బంపించెను. వీ రతిచమత్కారముగా వెనుకనుండి వారిపైబడిరి.

లక్ష్మీబాయి కాల్బలము వారిని చూచుటతోడనే పలాయనమయ్యెను. తుపాకులు, మందు మొదలగు యుద్ధసామగ్రి యంతయు నాంగ్లేయుల పరమయ్యెను. ఈసహాయముతో వారు మరింత జోరుగా యుద్ధము జేయసాగిరి.

ఇక విప్లవకారులపై నాంగ్లేయులు కురిపించుచున్న శతఘ్నులకు మేరలేదు. వారెంతశూరులైనను వారిలో క్రమము లేదు; సరియైన వ్యవస్థలేదు. ఆజ్ఞాపాలనలేదు. ఉపాయకౌశలము లేదు. "ఉపాయేన తు తత్కుర్యాద్యన్నశక్యమ్ పరాక్రమైః" అనుసంగతి ఆంగ్లేయులకుగ్గుపాలతో బోసిన దివ్యౌషధము. పరాక్రమము (Policy) కాపట్యముముందర పనికివచ్చుట లేదు.

లక్ష్మీబాయికి పరిస్థితులన్నియు గోచరించుచునే యుండెను; దుశ్శకునములు కాన్పించుచుండెను. తనకాల్బలము పారిపోవుట; విప్లవకారులను నాల్గువైపులనుండియు నాంగ్లేయు లగ్నిహోత్రపుంజములతో గప్పివేయుచుండుట; యోధులందరు కూలుచుండుట; యితరసహాయమేమియు లేకపోవుట-మొదలగు భయంకరపరిస్థితులలోగూడ లక్ష్మీబాయి ప్రభంజనుని భీభత్సరూపము నెగతాళిజేయు కర్ణధారివలె నిరువదిమందితో నాంగ్లసైన్యమును చీల్చుకొనిపోవుట కెన్నిసారులో ప్రయత్నించెను. కాని యామె ప్రయత్నములన్నియు వృధయయ్యెను.

1858 వ సంవత్సరము జూన్ పందొమ్మిదవ తేదీని సహస్రకిరణసూర్యభగవాను డాకాశ మండలమున దివ్యతేజోరాశివలె ప్రకాశించుచు నిరుపక్షముల యోధులను సూర్యమండలమును ఛేదించుకొని వీరస్వర్గమును జేరగోరుమని యాహ్వానించుచుండెను. మహారాణిపై బ్రిగేడియరుస్మిత్, కప్తను హేనేజు లిరువురు నెనిమిదవ హుస్సారుపటాలమును దీసికొని ఘోరయుద్ధమునకు దలబడిరి. లక్ష్మీబాయి పురుషవేషమును ధరించి పోరుచుండుటచేతను, ఆకాశమంతయు ధూళిధూసర మగుటచేతను శత్రుసైన్యము లామెజాడను కనుగొనలేక యుండెను. మహారాణి తనతోగూడ నాంగ్లేయుల

సేవచేయుచున్న సుందర, కాశీ అను నిద్దరు దాసీలతోను విశ్వాసపాత్రులగు నిద్దరు సరదారులతోను కొద్దిమంది అశ్వికులతోను ఆంగ్లసేన నొకప్రక్క ఛేదించివెచి కొద్దిదూరములోనున్న విప్లవ సైన్యముతో గలసి మరల నొక గొప్ప వ్యూహమును పన్నవలెనని ప్రయత్నించెను. కాని ఆంగ్లహుస్సారు దళము నలుగడలను గాచియుండి యామె ప్రయత్నములను విఫలము గావించిరి. ఈయుద్ధములో తల్వారుల తళతళలును, ఝనాఝన ధ్వనులును దప్ప మరేమియు గాన్పించకుండెను. అందరను ప్రాణములపై నాశ విడిచిపెట్టుకొనిరి. ఆంగ్లేయుల ఫిరంగిగుండ్ల వర్షమును, లక్ష్మీబాయియొక్క ఖడ్గప్రహారములును వందలకొలది సిపాయిలను గూల్చుచుండెను. రాణి లక్ష్మీబాయి తన కరవాలముచే నాంగ్లేయుల కంఠస్నానము చేయించుచు గుఱ్ఱమును వాయువేగమున బరువెత్తించుచు శత్రుసైన్యమును ఛేదించుకొని పోయెను. కాని యా గుఱ్ఱమిక ముందునకు బోక నిలచిపోయెను. అది చాల భయపడిపోయెను; ఇంతలో బ్రిగేడియరు స్మిత్ హుస్సారుదళము నామె వెనుకనే బంపెను. వారు గుండ్లవర్షమును గురిపించుచుండిరి; లక్ష్మీబాయికి వెనుకనుండి యొక గుండుదెబ్బ తగిలెను. దానివలన నామెకు బాధ కలిగెను. ఇంతలో శత్రుసైన్యము మీదకువచ్చెను. మరల వారికి సంగ్రామము జరిగెను.

లక్ష్మీబాయి మూడురోజులనుండి హోరాహోరీ యుద్ధమును జరుపుచుండుటచే గొంత యలసిపోయెను. కాని యామె రణోత్సాహమును, స్వాభిమానమును మొక్కవోలేదు. ఈవిషయమై (Empire in Asia) అను గ్రంథములో టారెన్సు యిట్లు ప్రశంసించెను.

"1857 లో విప్లవము బయలుదేరుటతోడనే యామె తన యశ్వము నధిరోహించి, పురుషవేషమును ధరించి వేలకొలది గుంపులను, సైనిక నికాయములను నడిపించుచు చివరకు గొప్ప గొప్ప మహారాష్ట్రదళముల కధినాయకురాలై రణకౌతూహలోన్మాదులను

త్రు భయంకరులును నగు తన యనుచరులకు మరియొక జోనుకన్య
పయ్యెను; (ఈ ఫ్రెంచికన్య ఆంగ్లసేనల నోడించి ఫ్రాన్సును రక్షిం
ను.) సర్ హ్యూరోజు సేనల నేవిప్లవనాయకుడును గూడ నీమెవలె
ాధించియుండలేదు. ఇంతేకాక నెట్టి విజయసూచనలును లేక
ృత్యుసదనమునకు గొంపోవు యుద్ధమందైనను గంటలకొలది నిరంత
ాయముగా బోరుచు నామె యుద్ధరంగమును విడువనొల్లదయ్యెను''

ఝాన్సీకోట నెట్టిసహాయమును లేకుండ ద్వాదశ అహో
ాత్రములు కాపాడిన రణచండికను, శత్రువు సహస్రనేత్రములను
ిరచి కాచుకొనియుండినను గూడ నిర్భయముగా కొలదిమందితో
ట్టణమును వీడి ఖడ్గధారచే నడ్డువచ్చినవారిని యమపురికి బంపుచు 24
ంటలలో నూటరెండుమైళ్లు స్వారిచేసిన వీరవనితను, పారిపోవుచున్న
ాన్య మధ్యమున సింహపుపిల్లవలె నురికి శత్రునాశనమున కవత
ించిన శక్తివలె బోరిన శౌర్యలక్ష్మినిజూచి యాంగ్లేయు లబ్బుర
డుచు నట్టివీరలక్ష్మి నెట్లయినను పట్టుకొనవలెనని పందెము వేసికొ
రి. కాని ఈశౌర్యలక్ష్మి భారత శౌర్యలక్ష్మి! ఆమె యుద్ధములో
ంపుటొండె చచ్చుటొండె చిక్కుటలేదు. "నేను మరణించుటే తటా
ంచినచో నాపవిత్రశరీరము నాంగ్లేయుల స్పర్శచే మలినము గావింప
ాల్లను'' అని నిశ్చయించుకొని పురుషవేషధారులైయున్న సుందర,
ాశీ లను నిద్దరు దాశీలను రామచంద్రరావు రఘునాథసింహు మొద
గు తన యంగరక్షకులను బిలిచి యుద్ధములో నేను పడిపోవుచో
ాశరీరమును మ్లేచ్ఛులు తాకకుండునట్లు మీరు సంరక్షింపవలెను,
ఆనాకోరిక లీడేరినపుడే మీరు యథార్థమైన స్వామిభక్తులు కాగలరు''
ని చెప్పెను. అయంగరక్షకులామె పలుకులను సువర్ణాక్షరములతో
మ హృదయసీమలందు లిఖించుకొని నీడవలె యుద్ధములో లక్ష్మీ
ాయి నెప్పుడును విడువకుండిరి. వారందరును గుఱ్ఱముల నధిరోహించి
యామె వెనువెంటనే యుండుచుండిరి. బాలుడైన దామోదరరావు,
ామచంద్రరావు దేశముఖు గుఱ్ఱముపై నుండెను.

హుస్సారుగుఱ్ఱపుదళ మీచిన్ని సైన్యముపై నగ్నివర్షమును గురిపించుచుండెను, మహారాణిపై నురికిన అశ్వికుల నామె తన ఖడ్గనైపుణ్యముచే చెదరగొట్టి ముందుకు బోవుచుండెను. ఇంతలో నామెదాసియగు సుందర, దీనస్వనముతో ఓ తల్లీ! చచ్చితిని! చచ్చితిని! అని కేకలిడెను. ఈమాటలు కర్ణపుటముల బడుటతోడనే లక్ష్మీబాయి గిర్రున వెనుకకు మరలెను. ఆమె కడు భయంకరదృశ్యమును జూచెను. ఒక ఆంగ్లేయుడామె ప్రియదాసియగు సుందరను యమపురికి బంపనుద్యుక్తుడయ్యెను! తోడనే లక్ష్మీబాయి వానికే యమపుర మార్గమును జూపెను. తిరిగి లక్ష్మీబాయి తన చిన్నసేనతో ముందుకు బోవుచుండెను. ఇంతలో లక్ష్మీబాయి గుఱ్ఱము వెనుకనుండి వచ్చు గుండ్లకు భయపడసాగెను. ముందొక చిన్నయేరు అడ్డమువచ్చెను. ఆ గుఱ్ఱము దానిని దాటక నిలచిపోయెను. లక్ష్మీబాయియొక్క స్వంత గుఱ్ఱము రెండురోజులనుండి యుద్ధములో పనిచేయుట చేతను గుండు దెబ్బలు తగులుటచేతను జ్వరపడియుండెను. ఈగుఱ్ఱము సింధియా గుఱ్ఱములలోనిది. ఇది లక్ష్మీబాయికి చాల విషమపరిస్థితులను దెచ్చిపెట్టెను. మహాభారత యుద్ధమున కర్ణుడు రథచక్రమూడి విరథుడైన చందమున లక్ష్మీబాయి తుముల యుద్ధములో తనస్వంతగుఱ్ఱము లేకయుండెను. ఆమెయెన్నిసారులు ప్రయత్నించినను ఆగుఱ్ఱము కదలక మెదలక యుండెను. ఆమెతోనున్న యాశ్వికు లందరును గుండు దెబ్బలతో జనిపోవుచుండిరి. ఈసమయమునం దామెయొద్ద నైదారుగురు పరమభక్తులైన సేవకులు దప్ప మరెవ్వరును లేరు. ఇట్టి విషమావస్థలో హుస్సారుగుఱ్ఱపుదళము వెనుకనుండి వీరిపై నురికెను.

ఇంతలో నొక యాశ్వికుడు లక్ష్మీబాయి నతిభీకరముగా మార్కొనెను. లక్ష్మీబాయి యదివరకే గుండుదెబ్బలచే నవసియుండెను; గుఱ్ఱము కదలకపోవుటచే కుడిభుజమే కూలిపోయినట్లయ్యెను!

ఇట్టిస్థితిలో నా యాశ్వికుడు పిడుగుపడినట్లామెపై బడెను. కాని లక్ష్మీబాయి యేమియు చలింపక కరవాలమును నాల్గువైపుల కత్యంత రయమున గిరగిర ద్రిప్పుచు నతిచతురతతో నాత్మరక్షణము

చేసికొనుచు నతనినొక్క పోటు వేసెను. ఆపోటుతో నతడు నేలంటు
కూలవలసినదే కాని యతడుగూడ చతురుడగుటచే నతికష్టముమీద
దానిని తప్పించుకొని తనతో పోరు సరుని గుర్తెఱంగజాలక నత్యా
శ్చర్యపడుచు మరల లక్ష్మీబాయిపై కురికి తనకరవాలముతో నామె
శిరముపై మోదవలెనని జూచెను. లక్ష్మీబాయి తన ఖడ్గమును గాలిలో
గిరగిరందిప్పుచు వానిఖడ్గమును తుత్తునియలుజేసెను. ఖడ్గద్వయ సం
ఘట్టనచే నిప్పులు జలజలరాలెను. ఒకప్రక్క మహారాణియొక్క తె
ల్లును కొద్దిమంది యంగరక్షకులతో బోరుచుండ మరియొకప్రక్క
కాస్వారు గుఱ్ఱపుదళ మశేషము బోరుచుండెను. ఇట్టిస్థితిలోగూడ
మహారాణి కొంతమంది సిపాయిలను గూల్చెను. కాని యొక యోధు
డామె ఖడ్గము నెట్లో తప్పించుకొన సమయముగనిపెట్టి వెనుకనుండి
యామె శిరమును కత్తితో చూర్ణముచేయ జూచెను. దురదృష్టవశమున
ఖడ్గమువలన లక్ష్మీబాయియొక్క దక్షిణపార్శ్వ మెగిరిపోయెను.
ఒకకన్నుకూడ నూడివచ్చి క్రిందపడెను. ఇంతలో మరియొక
యాశ్వికు డామె ఛాతిపై కత్తితో బొడిచెను. ఆమె శరీరమంతయు
గాట్లు పడియుండెను. ఇట్టియవస్థలో రుధిరధారలు గారుచుండ గుండు
దెబ్బలు తినిన బెబ్బులిచందమున నామె రోషపూరితనేత్రియై
యాంగ్లయోధు లిరువురపైబడి విరోధిరక్తపిపాసోత్సుకయై యున్న
తన కరవాలముతో వారిని యమధర్మరాజుకడకు బంపి తన క్షాత్ర
ధర్మమును సార్థకము జేసికొనెను. మహారాణి యీవిధముగా దన
యంతిమపరాక్రమము బ్రదర్శించెను. కాని యామె శరీరమంతటను
గాట్లు పడిరక్తసిక్తమయి యుండెను. ఆమెశక్తి అంతకంతకు క్షీణించు
చుండెను. ఆమె కవసానకాలము సమీపించుచున్నట్లుగాన్పించెను.

యుద్ధస్థలమునందే శరీరమును విడుచుచో మ్లేచ్ఛులామె పవిత్ర
శిరమును స్పృశింతురను భయముచే నామె వెంటనే రామచంద్రరావు
దేశముఖును బిలిచి తగు ప్రయత్నములను గావింపుమని యాజ్ఞాపించెను.
అతడు పరమభక్తుడు; మహారాణి శరీరమును జూచుటతోడనే యతని
హృదయము ప్రక్కలయ్యెను. కడుపు తరుగుకుపోయెను. అతడు కన్నీరు

మున్నీరుగా కార్చుచు నోట మాటరాకుండెను. వెంటనేయతడు యుద్ధ
రంగమున కతిసమీపముననున్న యొక పర్ణకుటీరములోని కామెను
గొనిపోయెను. ఈ కుటీరము గంగాదాసుబాబా యను వానిది. లక్ష్మీ
బాయి కడుడస్సి దప్పిగొనియుండెను. అప్పు డామెకు గంగాజలము
దనివితీర ద్రావనిచ్చిరి. ఆమె శరీరమంతయును రక్తములో స్నానమాడు
చుండెను. గాయములబాధ హెచ్చగుచుండెను. కాని ముఖముపై
మాత్రము వీరలక్ష్మి యెప్పటివలెనే చెక్కుచెదరక యుండెను.

ప్రియపుత్రుడైన దామోదరరావును బిలచి తనయొద్దగూర్చుండ
బెట్టుకొని రెప్ప వాల్చక నతనిని మాతృవాత్సల్యతతో జూచుచు
జగత్పాలకుడైన యీశ్వరునకతని నర్పించి సిద్ధార్థి సంవత్సర జ్యేష్ఠశుక్ల
సప్తమినాడు గ్వాలియరు సమీపమున యుద్ధరంగమధ్యమున, గంగా
దాసుబాబాకుటీరమున భారతదేశ శౌర్యరాశియు, నగణిత సుగుణ
నికురంబయు, పౌరుషలక్ష్మియు, దివ్య స్త్రీరత్నమునునగు మహారాణి
ఝాన్సీలక్ష్మిబాయి యిరువదిమూడవయేట నీ లోకమును వీడి స్వర్గ
ధామము నలంకరించెను. మహారాణి శరీరమును విడుచుటతోడనే
రామచంద్రరావు దేశముఖు తన దేవి యాజ్ఞానుసారము తత్క్షణమే
యొక చితిని బేర్పించి సమీపముననున్న తృణకాష్ఠములను దెప్పించి
విగతప్రాణయైయున్న యాపవిత్ర శిరీషకుసుమపేశల దేహమును
దానిపైనుంచి తన స్వహస్తములతో నగ్నిసంస్కారము గావించి
ధన్యుడయ్యెను.

సమాప్తము.

# ఆంగ్లేయుల పొగడ్తలు.

పరిపాలించుట కసమర్థురాలని మనము యే స్త్రీనుండి యొక సంస్థానయాజమాన్యమును లాగుకొంటిమో అట్టి స్త్రీ సైన్యముల నవలీలగా నడుపగలదని మనము కనుగొంటిమి. ఉత్తరహిందూదేశమున నామె విప్లవకేంద్రమయ్యెను. ఆమె హిందూమహమ్మదీయ సైన్యములకు బోడిసీయావలె నుండెను. ఆమెయొక్క యత్యంత సాహసోపాయముల వలననే గ్వాలియరు దానితోపాటు మధ్యహిందూదేశము కొంచెమించుమించుగా మనచేతులలో నుండి జారిపోయెను. ఢిల్లీ పడిపోయిన తరువాత ననేకవారములును, మాసములును సర్ హ్యూరోజు సైన్యముల కనేక కష్టములను గల్పించి ముప్పుతిప్పల బెట్టిన ధీరవనితయొక్క అద్భుత సేనానాయకత్వమేయని వేరుగ జెప్పనక్కరలేదు చివరకామె తనసైన్యములను గూర్చుకొని మనతో కాల్పిలో బహిరంగయుద్ధమునకు డీకొనెను. అచ్చట నోడిపోయిన తరువాత నామె తిరుగ గ్వాలియరులో మనపై ప్రబలయుద్ధ ప్రయత్నములను గావించెను. అనాడామెసైన్యములు కూలి చిందరవందరయై పారిపోవుటలో నామెలోప మెంతమాత్రమును కాన్పించదు. అశ్వికదళాధికారివలె నామెదుస్తులను, అస్త్రశస్త్రములను ధరించి తన సైన్యములతో మనపై ననేకపర్యాయములు భయంకర దాడులను సాగించెను; సర్ హ్యూరోజుచేత స్వయముగా నడిపింపబడిన ఒంటెలదళ మామె తుదిదళమును చీల్చివేసినపు డాశలన్నియు నశించినను చివరవరకును నిలచిన వీరులలో లక్ష్మీబాయికూడ నుండెనని వేరుగ చెప్పనక్కరలేదు”

“ఏ మహారాణియొక్క రాజ్యము మనము కలుపుకొనినవాటిలో నొకటియని మనమిదివరలో కనుగొంటిమో అట్టి ఝాన్సీరాణి లక్ష్మీబాయి మనతో చివరవరకును పోరిన తిరుగుబాటుదారులలో నొకతెయని వేరుగ జెప్పనక్కరలేదు. ఆమె తన స్వశక్తుల నీతిరుగుబాటులో నిది కేవలము తిరుగుబాటనియు సిపాయిపితూరీ కాదనియు పూర్తిగా

భావించి) ధారపోసెను. నానాసాహెబు, తాత్యాతోపేలతో నామె రణరంగమునకు దుమికెను. ఢిల్లీపడిపోయినతరువాత నామె మాసములకొలది సర్ హ్యూరోజుతోను, ఇంగ్లీషువారితోను హోరాహోరీగా పోరుసాగించెను. ఆమె సైన్యముల నాహవరంగములో నడిపించెను. ఆమె తనస్వహస్తములతో యుద్ధముచేసెను. గ్వాలియరును తనస్వాధీనములోనే యుంచుకొనుట కామె మనతో యుద్ధరంగమున బోరెను. అశ్వికదళాధికారి వేషమును ధరించి యామె మనల ననేకసారులు బహిరంగముగా నెదుర్కొని చిట్టచివరవరకు పోరుచు యుద్ధరంగములో చనిపోయెను. ఎట్టివీరాగ్రేసరుల కైన నలంకారములగు నాయుధవ్రేటులతో నిండియుండిన యామె శరీరము యుద్ధభూమిలో గాన్పించెను. ఔదార్యవంతుడైన విజేత అతిసంతోషముతో గొనియాడునట్లే సర్ హ్యూరోజు ఆమెను కీర్తించెను. అతడు తన ప్రసంగములలో నిట్లు వ్రాసెను. "వైరివీరులలో నుత్తమోత్తమ పురుషుడీయుద్ధరంగమున చనిపోయినట్లు కనుగొనబడిన దీ ఝాన్సీ రాణియే!"

"ఎప్పటికిని మరుపురానట్టి 1857 వ నాటి చరిత్ర యుత్కృష్టదేవియొక్క అద్భుతచర్యలును, నిరుపమాన ప్రతాపమును మరింత దిగంతశాశ్వత కీర్తి నొసంగుచున్నవి. వీరస్త్రీ మకుటమగు రాణి లక్ష్మీబాయి కిరువదియారు లేక ముప్పది (ఆమె వయస్సు 23 మాత్రమే) వత్సరములున్నవి. ఆమె సౌందర్యగని; అపారమైన యుత్సాహము, అతులిత ధైర్యము, ఉత్తమదేశభక్తి మొదలగునవి సుగుణరాసి. ఆమె విశుద్ధశీలము, మనోబలము, క్రియాకలాపానురక్తి మొదలగునవి జగద్విఖ్యాతిని బడసెను. 1857 లో తిరుగుబాటుకు బూర్వ మీమోహనాకారము ఝాన్సీ సింహాసనము నలంకరించి తన భర్త మహారాజా గంగాధరరావు దత్తత చేసికొనిన బాలకుని తరఫున చతురుడైన పరిపాలకునివలె నత్యంతకౌశలముతో బరిపాలించెను. ఈదేవికి దన ప్రజలపై జాల పలుకుబడికలదు. ఈమె యౌదార్య సమర్థతలు గల పరిపాలకురాలని ప్రతివారును సంభావించుచుండిరి.

"లక్ష్మి యీవిధముగా పోరాడెను. ఆమె తన యుద్దేశమును సాధించెను; తన కోరికలను సఫలీకృతము చేసికొనెను; తన మనోనిశ్చయమును నిర్వహించుకొనెను. జాతియంతయు సజీవముగా నున్నదని రుజువుచేయుట కిట్టి జీవిత మొక్కటియే చాలును! ఆమె సకల సద్గుణ సార నికురుంబము; ఇరువదిమూడు సంవత్సరములు వచ్చిరాని కేవల మొక యబల; కనుకందని గులాబివంటి మేనిసొగసు; మనోహరములైన చైద్యములు; విశుద్ధపవిత్రవర్తనము, పురుషులలో గూడ బహుకొద్దిమంది మాత్రమే చూపగల నిజప్రజాసంధానశక్తి కామె పెట్టినది పేరు. ఆమె హృదంతరాళమున దేశభక్తియను దివ్వె సదా జాజ్వల్యమానముగా బ్రకాశించుచునే యుండెను. ఆమె తన స్వదేశాధికృత కెంతయు గర్వించుచుండెడిది. ఇక యుద్ధములో నామెకు సాటియే లేరు! ఇట్టి దివ్యవ్యక్తి నొకజాతి తన కుమార్తెగను రాణిగను బడయుం భాగ్యమును కలిగియుండుట తథ్యముదు. ఇంగ్లాండు కిట్టిభాగ్యమింతవరకును అబ్బియుండలేదు. ఇటలీ విప్లవములో నుత్తమోత్తమమైన ఆదర్శములను, వీరత్వమును మనము చాలవరకు కనుగొందుము; కాని యిట్టి కీర్తివంతమైన కాలమందు గూడ నిటలీ యొక లక్ష్మిని కాంచజాలదయ్యెను!"

---